మానిశీథతారలతోడు! కృష్ణతోడు!
చెడ్డయొట్టున్న దిఁక మీఁద జెప్పవేని;

అనుచు దూరమునను వినవచ్చివినగాని
మెలఁగుఁబెట్టియూరొఁ బలుకరించి
యూరకుంటివనంతొ, నొకకొంత సేఁటి
కబల యిట్టులనియె నస్ఫుటవాణి!

II

ఓర్వలేనివారెవ్వరో యొకరినొకరు
పోల్చుకొనకుండఁ గ్రిందనువాల్చినారు
నీవు నాడును నడుమ నీ నీలితెరలు
సెజ్జపయి ప్రణయులమధ్య లజ్జలాగు

ఎవతెవనుచు నన్నడిగితి వీవు నుంచు?
ఎవఁడవని నిన్ను నడుగరాదేల యిపుడు?
నందియమ్మందితోఁటు నాయందెరవళి?
ఏల నీవాలకము నంశయింపరాదు?

ఎవతెనని స్పష్టముగ వచియింపఁగలనొ?
అనువుగాఁగన్నవారింటి యూడుఁబడుచు
నీడుగాఁ గొన్నవారింటి తోడికోడ
లిని, గ్రహింపు మిందెవతెనో! మనసులోన.

ఒకనికిఁ గుమారితను, మఱియొకని కాలి
నింక నొకనికి తల్లిని యిందులోన

నెవ్వరిటనో? భావింపుము హృదయమందు
వాలివకుసలు జ్ఞానసంభవము లేని?

నన్నుగని వారవైచి ప్రాణములువిడచె
నసంటిచంపాన మాయమ్మ, యప్పుడాది
పెంచి రిఆచేతులంబెట్టి పిన్ని మొదలు
గాఁగ నా ప్రజనంబులు కాంక్షతోడ.

వెన్నతోడ పండిన ధవళాన్నములను
ఎండ బడి భుజించుచే యెలుగ నెపుడు;
పూంతెసలుగుల తలయంట్లు బోసికొనక
శుక్రవారః మునిమ్ముశే చూడలేదు.

ఆకుమరుగు ప్రసూనముపోల్కి నంపముగను
నన్నుబెంపుచునుండి, రైనను మదీయ
తరుణసౌందర్యరేఖలే యిరుగుపొరుగు
ఆడిపోతల కాశరమూయె నోయి!

చదువుఁజెప్పెను నాకొక సాటియింటి
చిన్నవాఁడు నేరుపులు పుష్పించు భాతి,
వలపడియొఁ గొంతచక్కని యవ్వయంపు
పాటవమును నలంకారపరిచయమును.

అందమయిన పద్యంబుల నల్లునతఁడు
నునుపుఁబోగుల పట్టు నేసిన విధాన

పాడఁగలఁడు తియ్యని యష్టపదుల నెల్ల
సందెలందుఁ గల కల కషాయఫణితి.

పాడుచుండు నే నాతఁడు పాడినట్లు,
చదువుచుండు నే నాతఁడు చదివినట్లు,
ఇరువురముఁగూడి యొక్కప్పు డేకకంఠ
సరణిమై నాలపించు ముచ్చటలుగలవు!

తేటలూరెడు శుక్ల చంద్రికలమాద్రి
మా వయసుతోడఁ జెలిమియుఁ దీవలెత్తె,
యూరివారల దృష్టులు గోరగింప
నాల్కలపవాదరచనలఁ జిల్కరింప.

కొమ్మకొన నందగించిన క్రొత్తపువ్వు
ఎంతఅందటి కెన్నెన్ని చందములను
భిన్నభిన్నాశయములు మొల్పించునవుర!
ఐక్యగతియె ద్వైతాద్వైతమైనరీతి.

కావ్యకలలసింగారించు కవులమనసు
నళిమధువుఁబోలె నాసింతు మనవరతము
నవరససుధాకణాస్వాదనమును మరగి
తనివియే యెఱుంగము స్తనంధయములట్లు.

చదివినకొలంది నాత్మల నుదయమయ్యె
భావములు స్వాతిముత్యాలకోవలటుల

బాల్య సంలగ్నమైన ప్రపంచరక్తి
పాలుపిటికిగినగతి యయ్యె బడుచువాఁడ!

III

పగలు రే లిట్లు దిన మొక యుగముగాఁగఁ
గడుచుచుండఁ గొండొక ప్రొద్దుపొడుపు వేళ
బిచ్చమునకయి వైరాగిపిల్లయొకతె
వచ్చెఁ బాడుచు గోయిలల్ మచ్చరింప.

మాసిన మొగాన చెక్కిళ్లనువ్వు మొలకలు,
పచ్చతంగేటి పూరేకువంటి మేని
పసిమి మురికి పేలికలలో వాడుచుండె;
ధూళిమునిఁగిన బంగారుతునుకఁబోలె.

ముదిత యింతింతవాల్గనుల్ బెదరి బెదరి
యెంతవరకుఁ గటాక్షించె నంతవరకు
నల్లకలువపూవులతోఁ గగనములు నిండె
పెండ్లినాకిడ్డ చందాన వింతభంగి.

అబల యొలుగులుదీసిన యనుపృతసరసి
సరణిఁ గలకంఠ మెత్తి మూర్ఛనలు నింపె,
నెన్నివిసరులు విసరె నాకన్నెపాట
నన్నివిసరులఁ బారవశ్యములె గురిసె.

పూరిపడిసెమూఁడట దేవపారిజాత
సాల మహాపరిమళములు జల్లుకరణి,

ఎక్కడఁ బుట్టెనో యెల్లచక్కఁదనము
లా దరిద్రకుమారి మోహానపువాణి.

కడుపునిండఁ గన్నని యన్నకబళములకు
నోచుకొనని యాకన్నెకే నోములిచ్చె,
రాలుగరఁగించు గంధర్వలాలనమ్ము
జన్మవాసనలెంత నైజములో జగతి.

మలినవసనమ్ముఁగట్టిన మలిన తనువు,
మలిన భిక్షాన్నములఁదిన్న మలినవాణి,
నెట్టు లాసించె నాహార! యీవుగులకు
అఖిల కిన్నరీదుర్లభ మయిన గీతి.

తీవ తెగలాగి దిగలాగి తీవరించు
వైణికులకుఁ జిరంతనాభ్యాసపటిమ
స్వరము లనుబ్రస్తరించెడు పాటకులకు
అమృతసదృశమ్మయిన గీతి యబ్బదేమొ!

మొగము నవనీతమృదులమై యెగయుచెలికి
మనసు నవనీత మయియుండ దనుటనిజమొ!
వనలతలకును నుద్యానవనలతలకు
భేద మరసినకవి యెంత వేత్తయగునొ!

గాత్రమెత్తి యా బైరాగి కన్నె యాట్లు
పాడుచుండెను, వాకిండ్లవాడలెల్ల

చిత్తరువులతో రాణించు చెలువుదోఁచె
ఎచటివా రచ్చటనె చలియింపకుంట.

వీథి వీథులఁ బొరలె నాబిడ విలాస
రాగలాలిత గానతరంగ భరము
చెలి తమలపాకు తీవ పాదులకుఁ బాఱు
ధవళజలకుల్యభాతి నార్ద్రంపుగతుల.

ఆమె పాడిన పాటల నాలకించి
అందుముకుళించియున్న భావాబ్ధినుంచి
ఒకవిధంబైన యున్మాదచకితదశల
కగ్గమైతి మే మిరువుర మద్భుతముగ.

IV పాట.

పున్నమజాబిలి! ఓభామా!
పూచినసుఖరాత్రి నోభామా!
నెవ్వగతారలు! ఓభామా!
నిదురఁబోవనివేళ నోభామా!

పవనునిలాలన కోభామా!
పువులువేచెడి సందె నోభామా!
మొగలిపూరేకులు ఓభామా!
మొగములెత్తెడివేళ నోభామా!

నీమీఁద మోహము నో భామా!
        నిలిపి యోఁగలేక ఓభామా!
కన్నెలతే తెంచు ఓభామా!
        సన్న త్రోవలుబట్టి యో భామా!

తీయనిగీతము లో భామా!
        తీసిన తెన్నుల నో భామా!
సొగసుపేర్మిపుదీప మో భామా!
        చూపనజాడల నో భామా!

భావోత్తరీయము నో భామా!
        పఱచిచేసినదారి నో భామా!
ఎవరునుగనకుండ నో భామా!
        యేకాకినై లేచి యో భామా!

కాళ్ళనొప్పులుపుట్ట నో భామా!
        కడునడివచ్చితి నో భామా!
నీమేలిపడకిల్లు ఓభామా!
        ప్రేమతో వెదకితి నో భామా!

నేసినవాకిండ్లు ఓభామా!
        వీడఁగఁదట్టితి నో భామా!
సుఖశయనంబున నో భామా!
        సోలిన సుప్తిని నో భామా!

కాటుక రెప్పలు ఓభామా!
 కబళింపనివ్వుంటి నోభామా!
మాటిచ్చి కిస్సైక ఓభామా!
 పాటనాపంగలేవు ఓభామా!

ఏబంగరుకల లోభామా!
 నీవుంటివోయిప్పుడో భామా!
కనురెప్పలైనను ఓభామా!
 కదలలేదేయిప్పుడో భామా!

బొటనవ్రేలయినను ఓభామా!
 చిటుకనలేదిప్పుడో భామా!
అపరవశదశలో భామా!
 యెడదలింపరాదని సోభామా!

అడుగుకదలకుండ నోభామా!
 ఆవలవచ్చితి నోభామా!
నీప్రేమయూరాలు మాభామా!
 నీకొప్పగించితి నోభామా!

సందెరంగులబూరాయు నోభామా!
 యెండవువాకిండ్ల నోభామా!
స్వరమధుధారలు ఓభామా!
 జల్లులాడనిచోట నోభామా!

ఆనందసూత్రము లో భామా!
అల్లు తెల్లని పైట నో భామా!
నాయాటపట్టువై యో భామా!
ననుపున్న రమ్మట కో భామా!

V

గీ. అతఁడు వలచిన ప్రేయసి యన్యయనుచు
నేనువలచిన వన్నెలా డితఁడనుచు
వేఱువేఱైతి మంతట, చారుజలద
గర్భమునువదలిన జలకణములట్లు॥

గీ. ప్రేమపుష్పమ్ముపైఁ గాంక్షఁబెట్టి మనసు
లుత్కటమ్మగు విరహాన నుడికి కమలఁ
జీలిపోతిమి క్రోవలఁ జిరవిలీన
మధురమైత్రి శరన్మేఘమాలగాఁగ॥

గీ. అందమైనచందములఁ బ్రియమ్ములయిన
యాటపాటల భక్తిలీలానురతుల,
ప్రియుని సుఖశోభనమ్ముఁ గోరితిని నేను
సరససుమములఁ బ్రియుఁబొందు చైత్రిచాయ.

గీ. కర్కశములగు నియతులఁ గష్టమయిన
జపతపంబుల, నిష్ఠాప్రచారగతుల,
ప్రియసమాగమపుణ్య మర్థించె నతఁడు
భీష్మతపన రోహిణిఁబొందు గ్రీష్మునట్లు.

గీ. ప్రొద్దుపొడుపులఁ గమ్మని పూలజతల,
సందెవేళలఁ జల్లని చందనముల
నిశల మధురవీణాలాపనీయరవముల
నదిమొదల్ ప్రియుఁ గాంక్షించి వెదకుచుంటి.

గీ. పైరదిరిగి కళ్యాణపు పాటఁబాడు
పచ్చివాశిని బతిమాలి భంగపడితి,
"ముందుముం"దని వినఁబడ్డ మోహనోక్తి
సూత్రములులాగినట్టు లంచులను నడచి.

గీ. సంకెలలు త్రెంచి పోదుఁ బూసంకెలలను
బ్రియుని బంధింపవలెనంచు పిచ్చివాఁడ !
నాకు సహకారివగుము నీనావ నిచ్చి
కృష్ణ దాటింపు, మవల సుఖింపనగును.

గీ. నావ నడియేట నర్తించె నటివిధాన,
నిష్క్రమించిరి పాత్రల నియతివారు,
అలలచేతఁ బాడించెఁ బాటలను బ్రకృతి
యపుడు నిమ్మకు నీరెత్తినట్టులుండె.

# కోయిల

ప్రమదరసాలసోదయా తరంగములన్ దగిలించి, పారవశ్యమున నుయ్యాలలూగెదవ యారె! జగంబులఁ జేతన ప్రసంచము బహిరంతరస్ఖలనసంగతి మాని ప్రశాంతమున్న, నేత్రములకుఁగానరావు మధురంబుగ బాడెదవెందొ! కోయిలా!

గీ. శాంతిసాగరమగ్నమౌ జగతియందుఁ
దాచుకొన్న సరసఘోషయే వినంబ
డెను, నదికిచ్చేయిగుజ్జు కారడవికెలన
వినుచు నెలసోన బిలబిలధ్వనులఁబోలి.

గీ. మాదు సుకృతంబువలన నీ మధురసూక్తు
లింత వినఁబడు కాక దవ్వింతయున్న
నిస్తరంగానిలాబ్ధి సంధించి యణఁగి
పోక, పఱతెంచుటెట్లు నీపోకలిటకు.

గీ. చదలనుండి చల్లనగు తుషారకణము
లురులునట్టుల హాయిగా కురియు నీదు
కలకల కషాయమాధురీ విలసన లలి
తపద జీవనంబయిన గీతంబునందు.

వం. పిలపిలమంచుమంచుగురిపించెడి వేగునలేచి చిన్ని గం [మం
టలు మ్రోడలందు ఘల్లని స్ఫుటంబుగ మ్రోయఁగ మేయుగొఱ్ఱె
కల నరికాచు గొల్లనియుదారపు టీలలలోఁ బ్రతిధ్వనుల్
మొలవఁగఁజేసి మైమఱపు ముంపులముంచెదు నీదు పాటలన్.

గీ. కిన్నెర లోయూర మదరఁ బల్కించు మించు
బోణులదె యపస్మార నిద్రాణులగుచుఁ
బలుకు బడియుంపు, సన్నంపు వెలుఁగుకళుకు
మృదు లతాగతి మెఱుఁగ కానుదురు మూర్ఛ.

చం. ధవలచిరత్నరత్న రచితంబగు సౌధము నగ్రమందుఁ బూ
నవకపు సెజ్జపై వలపునన్ దన వీణియ మేలగించి, మో
హావశమౌగాఁ బ్రపంచమును నాకుఁ వెట్టు నోయూరివోలె నీ
భువనములెల్ల నాదమయముం బొనరించెదవౌర! కోయిలా!

గీ. పొరలు పశులని బిగువు పూవిరులసరణి
బాలభాషలపగిది నవ్యక్త మాధు
రీధురీణసారళ్య సంత్రాణభరము
గ్రుమ్మరించెదు నీగీతి కోకిలంబ!

చం. రతనపుముక్కలట్లు రుచిరంబగు పల్కులతోంద చందమం
చితముగ నేర్చికూర్చి విరచించెదు నీమృదుగీతి, నింతయున్
యతనపుఁ బాటవంబును బయల్పడనీవు పికంబ, నీదు గు
బ్బైతనయగారపుంగయితే విశ్వము మూర్ఛిలజేయు టబ్రమే!

చం. చినుకులుచిన్కులై మధువుసిందెడునట్టు లలంతియొంతలో
తునుకనుడుల్ జతించి, కలదో! మతిలేదా! రసంబో! భావమో
యని మెదిమెద్దియాంచుఁ గవులబ్బులు సాచఁగ మబ్బునీడ దా
గిన నెలరేకసోకు లాలికించెదు నీకవనానఁ గోయిలా!

గీ. మఱచిపోయిన యేసిని విమణి సజీవ
గీతికలు పాడు విన్పెద వో తలంప
శాంతియెఱుంగని యీ మనుసంతతులకుఁ
దెలియఁ బడదింతయుఁ బదర్థముల తెఱంగు.

గీ. తగులపుందీపియును, బిడ్డమొగము నెడలఁ
దెగనికాంక్షయు, స్వార్థవృత్తినిరతియుఁ ద్య
జించి, తన దేశమాత సేవించు వీరు
నెవని మఱచితివో వచింతువు పికంబ!

గీ. నిందుకవుగీఁడ్ల కెడఁబడి మందు విరహ
మునఁ దపించెడి యే ప్రవాసినుఁ గాంచి
మెత్తనగు గుండె జాలి రేకెత్తవచ్చి
తెలుపుతువో నాయికా దేశములను పికమ!

చం. అకట! నిపాట! చేతులెటులాడునగదోయి! యుభేదమోహకా
తుకమున సైజడుల్ మఱచి పూలుకపోతము నేయగా! వధిం
పకు వధియింపకంచు పికమా! యనుకంప తొలంక సాశ్రుగీ
తికలను వేసుకొందో! కలదే? తెలియుంగ భవద్విచారముల్.

ఉ. మా త్రైపుటప్రవుల్ నయమనసుల్ డిగజాఱఁగ నూటరాని డ
గ్గుత్తిక తోడ సంపకవు గూతుఁ గవుంగిటఁ బాయలేని యే
మెత్తనితల్లికన్న చెలిమిన్ మధురంబుగఁ గీరితింతువో
క్రొత్తయిగుల్లమేపఁద! యెఱుంగనునా! భవదీయబోధలన్.

గీ. ప్రణయపు గాథయో? దారుణ రణకథా క
థనమో? లేక సందేశ గానమునకళా క
లాపమో! తేటఁబడదు నీ లలితగీతి
చంచలతనూఁగు మర్త్యప్రపంచమునకు.

గీ. పలు తెఱంగు, లనేక భావములు, భిన్న
రుచులు, కలఁడునికళలు రేగుచుఁ జలించు
విశ్వమిదె విశ్రమించి నీ విమలబోధ
వినియెడిని యదర్థ మెఱింగికొనెడునార్థ.

గీ. పవలు జేలును నాకమవ్వంపు జెలుల
కౌఁగిళులఁ జొక్కి సోలెడు కాముకులకు
బోధపడదింతయును నీదు మోహనోక్తి
సొలపులనుమాన్ప కలఁడెఁ గొలుపుగాని.

గీ. తర్కములల బోధగాక, సూత్రముల విడక
భాష్యమీమాంసములఁ దేటపడని, తాత్త్వి
కులరహస్యము లెటు తీర్పఁగలవో పికమ!
ఆలకింపుచున్నారు వేదాంతు లదిగో!

గీ. "కూ"యనెడు నీదు మేల్కొల్పు హాయి కలరి
మొలుఁగులిచ్చు పల్లుల కలకలము వినెదొ!
స్వాతుల సందేశమును వాదు వలిపి, యాన్య
యించు నీగీతి నెటు సమర్థించుకొందు?

గీ. సెలవి నురువులతోడఁ బచ్చికలురాల
నిలువఁబడు మోములనుసాచి నెమరు మఱచి
పాడియావులు నీముద్దు పాటవినుచు
నెదియొ పరమార్థమందుల నొదవుననుచు.

చం. పసితనమందు నుయ్యెలలపైఁ జనుబొత్తుల పండఁ బెట్టి పా
రుసడల మాదుతల్లు లలరుంగతి నెప్పుడుగీతపాడిరో
యసలది విస్మృతంబుగ నెనప్పుడె మాయెద; నిల్చియుండె నీ
దు సుకృతి లేకయున్నఁ గలదో? కలమాధురి యింతనీరుతిన్.

ఉ. పెండ్లికుమారుఁడై చిగురువిందులకేగు వసంతు రాక నిం
డ్లిండ్లకుఁబోయి తెల్పెదు పయింబయి కొమ్మలనంటికన్నెపూఁ
బోండ్లకు రాయబారములొ మోహబుతూదంపు పూతగీతమో?
పండ్లను జెండ్లనున్ బసవు వారెడు పూవులనోము పాటలో.

గీ. పూలపూజలు సలిపిన మోహనుఁడు వ
సంతుఁ డాతని రాక నీవింత చాట
నేల, కేవల నాంది కాఁజాలదిదియు
చాల పరమార్థమెదొ తెల్పఁబోలు పికమ!

చం. మొలమొలఁబాఱు కాలువ సమీపమునన్ గడుమెత్తనైన శా
ద్వలమును పచ్చఁ జేయించి, మమతంబొలివోని ప్రియాను [రాగ ని
ర్మలమదిరాంధ సాల సభరంబునఁదూగు కురంగదంపతుల్
సెలిమి కిపనఁగఁబాడుము ఫలించును నీశ్రమమెల్ల! కోకిలా!

కం. పలికించినదారువుల రు
తులకుఁ జెవులు కోసికొను నధోగతులకు నీ
గ్గోలయఁగఁ గలకంఠము! నీ
కలకంఠ రవామృతమొలుకం బాడెదవో!

గీ. పిదుకువెన్నెలపాలు తేమొదవు కమ్మ
కప్పురంబిచ్చునసఁటి చిక్కని మరంద
మొలుకుఁ బూఁగుత్తి కడుపునఁ దెలియరాదు
నైజభిన్నత సృష్టి సంతానమందు.

గీ. పవనమును దిక్ష్యాగించి మార్దవముఁ బెంచి
నవనవంబగు రసము మొలవరచించి
చిత్రికులకును గవుల కుష్టవమును ల
గించు కోకిలా! నీపూత గీతఫలము.

చం. మినమినలాడు క్రొన్నరుగు మీఁగడతెప్పలు తేలుచుండఁ
గొండ నెనసి పాఱు కాలువ కెడాపెడ మొల్చిన చెట్లగుంపులో
వినఁబడు "గింగురుల్" సెవులపీడ యొనర్పక మున్న నీమృదు
స్వనమును వెల్లిగొల్పి కవిసంతతులన్ గరుణింపు కోయిలా!

గీ. చెలిమి మానుడు లాలకించినను సరియె
విప్పి నీభావములను జెప్పినను సరియె
కాకయుండిన ఫలమేమి కోకిలంబ!
త్వదుపదిష్ట గీతామహ్లాదయమువలన.

ఉ. ఇంపగునీదువాణి సుదయించెడి యొక్కొకమాట యొక్క ప్రా
ణంపుసుధాకణంబయి మనంబుల నువ్విళులూరఁ జేయు మో
హంపుభరంబుఁదీర్పఁగ ప్రియంపు తలంపెటుఁగింప, కింకశాం
తింపులజోలతేల వినులింపుల లీలలవేల! కోయిలా!

చం. వినఁబడలేదు కృష్ణు వలపింపుల పిల్లనగ్రోవిపాట లిం
కను, జనియింపలేదు కలికాలమునం దల రాధ లెందుఁ, జ
ల్లని యమునానదీజలములన్ మెడలెత్తుక నీదులాడ వా
వులు నిఁక నేటిగానములుపో! తలపెట్టఁగ మానుఁ గోకిలా!

గీ. నవరసంబులు పోషించినారు కవులు
నవరసంబులు నీపోషణమున నడరు
తన్మయానందమధురి మోదయుభరంబు
గడుగు నీగతి నేమి పల్కుదును పికము!

గీ. దివ్యసందేశమనుచు సందియము కొంత
కలకలాగీతియను కలకలము కొంత
నైజకంఠస్వరంబను మోజుకొంత
కలిపి కలఁచెదుమమ్ము పాటల పికంబ!

గీ. వినువక యనేకవత్సరాల్ కొనరి కొనరి
ఋతువు దప్పక చాటెనయేని నీదు
పాట కర్థంబుసుంతయుఁ దేటపడదు
అటులగుటఁ దావకాదేశ పటుతరోక్తి
యథమ మానవతతికిఁ గాదని తలంతు.

# కనకము

## (ఒక స్వప్నము)




మం బురదంబడి యె
క్కుండనె కాళ్ళుచ్చుకొనుచుఁ గడు నలసటతో
రెండామడ నడచితి తప
నుం డస్తాచలముఁ జేరను దరిసితిఁ బురిన్.

గీ. పెరుగు నన్నంబు సాపడి ప్రియములాడి
తూగులాడెడి నిద్దుర నాఁగలేక
పవ్వళించితి నొక్క తల్పంబునందు
ఎచటికో పోయెఁ బ్రాణంబు లింతలోనె.

గీ. కోడి కూయుచునుండెఁ 'గొక్కొ' యటంచు
అప్పుడు మేలుకొనవలదె 'ముద్దాడుచున్న
సొగసుపిట్ట' చివాలున నెగసిపోయి
నటులు నెద్దియొ విస్మృతి యానుకతన.

ఉ. నేను శయించియున్న రమణీయనిశాంతమునందు, మెత్తనౌ
పానుపులందు నిద్దురలఁ బాయకయుండి రనుంగుచెల్లెలున్
జ్ఞానవతీశిరోమణి, ప్రసన్నగుణాదర నాదుపిన్నియున్
మేనుసొంగి కుండ నలమెన్ బెనుమైకము నాఁటి సయ్యెడన్.

చ. పడమటిదిక్కునన్ మసఁగువాల్పక యుంచినజాలకంబునన్
పుడిపడ స్రుక్కి యొక్క పసుపుం బులుఁగయ్యెడ దూఁటివచ్చి, దా

పద్మదళఖండ మనసోగ పాటియటుత
నలుపుమచ్చయొకండు సొంపొలయుచుండె.

ఉ. మెత్తని పట్టుకుచ్చు కలిమింగయికోక యె పూలగుత్తి నా
యుత్తరుణంపుఁ బుల్గు కడుపచ్చపు పొందికతో నెసంగు కెం
పెత్తిన దొండపండనగ నింపగు దిద్దిన కోలముక్కు, ఆ
ముత్తెమువంటి పిట్ట పొలుపుం జెలువుం దరమే వచింపఁగన్.

కం. కొనగోరులు నునుపయి వం
గిన మావిచిగుళ్ల పగిదిఁ గెంపెసఁగియు వాఁ
డిని నతినిశితములై పొలి
చినగతిఁ గనుపట్టెఁ గొలఁది-చీలిక లగుచున్.

గీ. నడల కుల్కు బెడంగు, అందంపుమెడను
పెడకుఁ ద్రిప్పుచు టెక్కులార్చెడి సొబంగు
కళుకుఁ దులకించు నొడలి యొప్పుల తెఱంగు
కలదు కందెందు లేని ఆకనకముందె.

చ. అలతలువాయఁ, జడుపులాఱఁ, బ్రియంబునదువ్వుచున్ గరం
బుల ననుకూల పంజరముపోలికఁ జేసి, వినోదభార వి
హ్వాలమతినయ్యు నెయ్యమొలయంగను బ్రాణములొక్క యెత్తుగా
వలపునఁ జూచుచుంటి బలవంతము మానివిహంగరత్నమున్.

గీ. పెనఁగులాడుచుఁ గొంత, మ్రాగనులు వెట్టి
కదలకయ నిల్చి కొంత, చక్కని నఖాగ్ర

ముల నెఱికలు గోకుచుఁ గొంత, కలఁగి జివ్వున
నెగసి యెగసి యాసు గొంత నటనఁ జూపె.

చం. ఇటులొక కొంత యాటలపయిన్ మమతం గనకంబుతోఁ బెనం
గుటఁ గనులారఁగాఁ గని యిగుళ్ళయెడం దనుజాలి మోన తె
త్తుట వచియించె పిన్ని! కలదో? సుకుమారమణీ! వినోదలం
పటమతి వైపులుంగునకు బొములు వన్నియు, వింతసూచుటల్.

కం. ఒడలెల్లఁ జెమట లెత్తఁగఁ
గడు శ్రమముం బడితి వేమి కనకము గలదే
'కడగండ్లమారిపులుగున'
కుడిచినఁ గూర్చుండఁ బోవు కొంచెము కత్తా!

కం. వదలఁదగు నీపులుంగును
సదయుఁడవై యాట పాట సయ్యాటలకీ
మృదులద్విజ మోపము, పం
పెదుగాకల యుత్తవారి పిల్లనుబోలెన్.

కం. అని యాడువారి మెత్తని
గొనముల నారళ్య మలమికొనఁ బలికిన నా
పినతల్లి మాటలను జెవు
లను బెట్టక యిట్టులంటి లాలితఫణితిన్.

శా. పిన్నీ! పుల్గును బట్టరాదనుచు నే వేదాంత మో చెప్పి న
న్నున్నొప్పించితి వింతదాక, యెటులూనుక్ డెందమానందశాం

తన్నిత్యంబుగ? నిశ్చల ప్రమదముల్ నిండారు విజ్ఞాన సం
పన్మాంగల్యపుఁగ్రొత్తతోర్పుఁదం మనుజుల్ సల్పంగ నాలింపవో.

ఉ. రెండవుఁ గందళించిన సుశీబంధనికి విశారదైన ప్రా
ణ్ణం బోలఁగించి, భావసుకుమారత కందిక యుండ, నిర్భరా
నంద మరందమొల్కు.. సుమనస్సరసీజములం బ్రమోదతృ
ష్ణం దనియించుచుండు ఘన జ్ఞానుల సృత్తములాలకింపవో.

శా. తల్లీ! ప్రాణికి నైజకృష్ణలగు సాంద్రంబైన యానంద వాం
ఛల్లీలాదృతిఁ గాని చల్లఁబడ, వుత్సాహ ప్రవాహాంబుసఁ
గల్లోలంబగు నింద్రియంబులు తదేకధ్యాన విన్యస్త భా
వోల్లాసంబును గూర్చు, శాంతిననవోయుం బిమ్మటం బెల్లుగన్.

మ. అవనీ మోహనమైనయీపులుఁగు మైయందంబు నానందమున్
మివులన్ జూచియుఁ గేలనూచియు శ్రవోలీలోత్సవంబై నమం
జువ వాగ్ధోరణి నాలకించియు, హసించున్ నాము హోవల్లి, ప
ల్లవమై, కోరకమై, ప్రసూనమయి లీలాగుచ్ఛమై స్వేచ్ఛగన్.

మ. నునుపుల్ దేఱు మెఱుంగు ఱెక్కలను నింపుంగాఁగిటంబట్టి మె
త్తివయుత్సాహము, సోయగంపు మెడవాల్ ద్రిప్పళ్లుగాంక్షిం
[చిచూ
చినయుల్లాసము ప్రాయపుంబహాయసల మైసింగారమీక్షింపఁబం
చిన సంతోసము చెప్పఁగా నలవియే! చిన్నీ! విచారింపఁగన్

శా. నేత్రాంతంబులు శోషవోయినగతిన్ స్విన్నాంబులయ్యెన్, దయా
పాత్రంబీ తొలికాన్పు పిట్ట విడిపింపంబోలు నీపాటికో
పుత్రా! భూతదయాసుధామధురమై పుష్పించు నీచేత మే
మాత్రంబుం జలియింపకే తగిలె హింసారక్తి నింకేమనన్.

మ. ఎపుడో విస్మృతులన్ స్మృతిందగులునో యీ! నాయనా! చిన్నిప్రా
యపు బాచిల్కలఁ బట్టరాదనెడి న్యాయంబున్, విచారింపకే
యుపబాధల్ బున కేల పాలుబడె దీ యన్యాది వేధోండ మా
యపర బ్రహ్మకళామయం బెగడ ఛాయాభిన్నమై తోఁచినన్.

మ. కడుపుం దీపనొ? హా! కుమార! యని కేకల్ వెట్టవ్యాసుండు నె
క్కుడువై నాస్యమునూని, సర్వసముఁడై 'కోహ' మ్మటంచున్ బరుం
గిడు నా శ్రీశుకుఁ జూచి చెట్టులను రక్తింబిల్చుచున్ దన్మయం
బడరన్ ధన్యములయ్యె నంతను మును నీవాలింపవో పుత్రుఁడా!

చం. గొనములలోన భూతదయ కోమలమంచును నొక్కి పల్కి, చే
తనము సమస్తవస్తుగుణతత్వమునందును భిన్నకాంతులన్
బెనుపడియుండునంచు మురిపెంబులగీతములన్ రచించి, మో
హనముగ బాడుచుందువది యంతయు నెందరికిన్ గుమారుఁడా?

చం. అలనలచక్రవర్తి కలహంసము నాఁచిన యప్పుడామె కీ
తల వచనంబులన్ జదువ తల్లిరో! తాలయినన్ గరంగు సం
చలమిషతించుచుందువది యెట్టులమా తెను పుత్రి! యాటపా
టల మచుకారమున్ విడ వెడందను బుద్ధియు దెంత గల్గినన్.

మ. కొడుకా! చెప్పినమాటలన్ వినవు నీకుం దోఁచ దేమంచు, నీ
పడుచుంబుల్గును బట్టినంతటనె యేభాగ్యంబు నీకబ్బె నె
క్కుడు ముద్దాడి వినోదమారసితి సంకోచింపకే ఏపుమా!
ఈడియాసంబడఁజూడఁగూడదట యేప్రాణంబునేనిన్ భువిన్.

శా. వెన్నుంబోలుగదోయి నీమనసు తీవెన్ వంచి పుల్గోయ లే
వెన్నండైనను బౌద్ధధర్మముల నేమేమో ప్రబోధింతు వీ
వన్నెంజిన్నె పులుంగుఁబట్టికొని ముద్దాముల్ వడంజేయఁగా
జన్నే? గాదిలిపుత్ర! చెడ్డపనులం జాలింపలేవే యికన్.

గీ. పాలుగారెడు నీపిట్ట ప్రాయమైన
అలసి సొలసి యవస్థల లలిత లలిత
మగుచు గన్పట్టు వగచిన్నెలైనగాని
తరుణ కరుణాస్వభావ పాత్రములుగావొ!

చం. కలనయినన్ వికారమును గానక, ప్రాణములెల్ల నీపయిన్
నిలిపి, తదేక నిశ్చలత నిండుమనంబున నిన్నుఁజూచుచున్
మెలఁగెడు పిన్నిమాట చెవినింపగదోయి కుమార! ఇంక నీ
వులుఁగునువీడి నామదికి మోదము శాంతముగొల్పుమియ్యెడన్.

కం. అని పరవశయై కరుణము
తోణకన్ వచియించెనామె, తోట్రోడన నా
మనమెదియొ వికారపడన్
గనకంబును నెగిరిపోయెఁ గలలో నంతన్.

## స్వప్నశాంతి

మ. కలలో ముద్దులుసూపి యాంకనక మేగఁ దాని నెయ్యంపు తీ
పుల కారాటము నంది కుందు హృదయంబుఁ శాంతి సేయుం దలం
పుల నస్మత్కవితాళికిఁ బనిచితిఁ భూలోక మీక్షించి యెం
దులనేనిఁ గనకంబు బిల్చికొనుచుఁ దోతెంచునఁ భ్రాంతితోఁ.



# ధ్యానిబుద్ధప్రతిమ

మ. బహుళాధ్యాత్మిక దివ్యసత్వసుషమావ్యాకీర్ణతన్ దృక్పయో
రుహపాళీద్వితయంబు యోగనియమారూఢస్థితిన్ మూసి; దు
స్సహబాహ్యస్ఖలిత ప్రపంచదురవస్థా దూరసంసిద్ధికై
యహాహా! చూచెదెయాత్మబోధన నిరీక్షాపేక్ష శిక్షావిధిన్.

మ. బయలన్ గాంచినఁగానన య్యెడుజరాభారవ్యథా దుస్సహా
ర్తియుతక్షోభలటంచు నెంచి పటువక్రీభూత దుష్కాలసం
చయ సంచార వికార మారసి, యపస్మారక్రియాయాత్తి రో
సియె, నేత్రంబులుమూసితే! హృదయవంశీగాన మాలింపగన్.

మ. సమసెన్ బ్రాచ్యమహత్వతత్వము, కళాచాతుర్యముల్ మాసె, వా
సె మహాధర్మయుత ప్రశస్తమతముల్, జీర్ణించె సౌందర్యభా
వము, క్షీణించె స్వధర్మగౌరవము, తీవ్రంబై పరాచారదా
స్యము రాణించెను భారతీయుల యవస్థన్ జూడలేనంచు నే
త్రములన్ మోడ్చి హృదంతరంగమున స్వారాజ్యంబు సీక్షించెదే!

మ. నటనంబాడెడు నెమ్మొగంబున చిదానంద ప్రభాలక్ష్మీ సం
ఘటితధ్యానవిలాసమూర్తి హృదయాకాశంబునన్ వెల్గు ప్ర
స్ఫుటవిజ్ఞాన కళాంకురస్తబకితజ్యోతిః ప్రకాశంబు ము
చ్చటగా జూపెడు సాధుమార్గ్యగుణగుచ్ఛవ్రాతమా! గౌతమా.

ఉ. ఆసలఁబోనడంచి విషయాదిశరీరసుఖంబులన్ నిరా
యాసమునన్ ద్యజించి పరమార్థ మెఱుంగ మనంబలంచి, వి
శ్వాసముఁ నించి సర్వసమభావము నెంచి, విశుద్ధతన్మయా
భ్యాసముఁ బెంచి, దివ్యపరమావధిఁ జూపెడునీమ మూర్తియున్.

# కవిత





ట లయిన పుణ్యారణ్యా ♦ వాటికలను
బుట్టితి నుషఃకుమారి తోఁ ♦ బుట్టుగాఁగ

* * * *

అంద మెగఁబోయు లావణ్య ♦ మాహరించి
తపసివం బసియాడు జీ ♦ వనము త్రావి
పెరిగితిని నిత్యకోమల ♦ స్ఫురణలడర
ఇగురుటాకు నెలల పచ్చి ♦ యెండలందు

* * * *

గ్రీష్మమానసవేణికలఁ దే ♦ టినజలాల
స్నానమాడి శిరోజగు ♦ చ్ఛములు కడిగి

* * * *

నింగి బాలెంతనడికట్టు ♦ కొంగులనఁగ
జాఱు నతసీపయోద ప్ర ♦ సన్న రేఖ
లందికొని లాగి చీరెగా ♦ నందగించి

* * * *

క్షాళితవిశాల విశ్వరం ♦ గంబునందు
నిండువెన్నెల తెలిచాంది ♦ నీలుగట్టి
మొలక పచ్చని ముగ్గులు ♦ పుడమిఁదీర్చి
శారదోత్సవ భోగమ్ము ♦ నలిపి దనిసి

పచ్చిముత్యాల వాయనాల్ ♦ పంచిపెట్టు
ఉదయసతి కాకుఁబచ్చప ♦ య్యెదలుసాచి

*    *    *    *

పత్త్రి వస్త్రాపహారణపా ♦ పంబుకతనఁ
జిన్నవోయిన కొమ్మల ♦ సిగలమీఁద
ఋతుహితస్నాన శోభన ♦ మెదుగ నరసి

*    *    *    *

తడిసితడియని నాజూకు ♦ త్రాళ్ళవలల
భావశుకములు బందాలు ♦ పడ రచించి
ప్రాణిలోకమ్ము నానంద ♦ పథవిలీన
మహా దనంతసౌందర్య సా ♦ మ్రాజ్యమునకుఁ
బెనువలపుఁగోన నారాట ♦ పెట్టుచుంటి,
చిక్కిన శకుంతములకు స ♦ చిత్రమయిన
అమలవాగర్థకేళీర ♦ హాస్యమధువు
నామెతలుపెట్టి సాకితి ♦ ప్రేమవిరియ

*    *    *    *

నాదుసౌందర్య విభవమ్ము, ♦ నాదు రేఖ,
నాదుకన్నె సింగారంబు, ♦ నాదుచేష్ట,
నాదునడకల పోడిమి, ♦ నాదుఁగీతి,
సుమధురంబైన పూజాప్ర ♦ సూనమట్లు
అస్ఖలితమైన కన్నె సో ♦ యగముచాయ
కనులఁబూజించి మనసుతో ♦ గారవించి

వాణిఁద్రావుచునుండి ర ♦ రీణాభక్తి
పరిపరివిధాల శోభా త ♦ పస్విజనులు

* * * *

బాలపుష్పము నంటిన ♦ పాపమనుచు,
ముగుదవలె రేకుఁ జెఱఁగుల ♦ మూసికొనిన
మధురతారుణ్య మచ్చినా ♦ మాత్రమనుచు,
అడుగుసోకినకడనెల్ల ♦ నణువులణువు
లగుచు ప్రాణకళలు రాలు ♦ నందమొంచి
కొలుచుచుండిరి భావవి ♦ హ్వాలులున్ను

* * * *

నిత్యకౌమార తరుణాభి ♦ జాత్యనగుచు
నింత స్పర్శాకళంకము ♦ నేనియెఱుఁగ.



# ఆచారక్షయము

౧



శ్రీరు తీరుల నలం ♦ కారముల్ మ్రుగ్గులఁ
జిత్రించు మవ్వంపుఁ ♦ జెతిమేల్మి
పూసలతో బొమ్మ ♦ పోసిన యట్లు చ
క్కని కుట్టుపను లల్లు ♦ కౌశలంబు
నైవారములు లేక ♦ యే వలయము లష్ట
దళ రేఖల నమర్చు ♦ కలికితనము
పాడేటి రాటాల ♦ పాలు దీసినరీతి
సన్నదారముఁ దీయు ♦ జాణతనము

గీ. తెనుఁగునాఁటి కులస్త్రీల ♦ దినదినంబు
సన్నసన్నగ నణఁగారి ♦ చచ్చుచున్న
వకట! ఈగృహాజీవ దీ ♦ పికలు నిలువ
స్నేహనిధికి భిక్షాటన ♦ సేయరేమొ!

౨

సీ. ఏడాది పొడుగున ♦ నింతతీరిక లేక
చేలలోఁ గష్టించు ♦ సేద్యకాండ్ర
పెద్దపురాణాల ♦ విన నోచుకొనక యూ
రికి దూరులగు దుగ ♦ దృష్టజనుల

ఉప్పు కల్లుకుఁ గూడ ♦ నోడ లమ్మవలసిన
ఆధారశూన్యలౌ ♦ అనదవాండ్ర
ఇంటిబానిసచాకి ♦ రే సర్వమని తూర్పు
పడమర లెఱుగని ♦ పల్లెసతుల
గీ. ఎవ్వఁడింక తాంబూర వా ♦ యించుకొనుచు
దరిసి సదవు పజ్జాహ్లాద ♦ తంత్ర మెపుడు?
అన్నకాటక పాటులుండ ♦ నావహించె
భూమి నానంద దుర్భిక్ష ♦ మును సఖుండ!

౩

సీ. వినువారి కన్నీరు ♦ వినవాకగా బొంగ
సీతమ్మ కష్టాలు ♦ సెప్పి సెప్పి
వెఱ్ఱిగొల్లడు గూడ ♦ నుఱ్ఱూతలూగంగ
వీధిభాగవతాలు ♦ వేసి వేసి
ముసలివాండ్రును మీస ♦ ములు త్రిప్పి కాకెక్క
వీరబొబ్బిలికథల్ ♦ వినిచి వినిచి
ఆబాలగోపాల ♦ మావేశమున త్రుళ్ళ
పల్నాటియుద్ధాలు ♦ పాడి పాడి
గీ. పల్లెపల్లెల ప్రాణము ♦ పచ్చగిల్ల
జాతిసుఖము పోషించితి ♦ సర్వకాల
మెచ్చుల సురిఁగిపోతివో ♦ బిచ్చకాఁడ
కవివి పాటకుఁడవు నీవె ♦ గావె సఖుఁడ!

౩

సీ॥ బువ్వమ్ముబొతులఁ ♦ గవ్వించి ఏయసుకా
వరముబ్బ పడుచులు ♦ పాడశేరు
గొబ్బితట్టెడువేళఁ ♦ గూడ కన్నెనెలంత
లరమరలే కాడ ♦ మఱచినారు
తద్దెపండుగల పై ♦ తమియూల లూగుట
మోటుగా మగువలు ♦ మూసినారు
రుక్మిణిమొదలుగా ♦ రుచిగొన్న బొమ్మల
పెండ్లిండ్లు బాలలు ♦ విడచినారు
గీ. ఏ నిరపరాధమగు క్రీడ ♦ లింతవఱకు
జాతిముఖకళలనదగు ♦ జానలందుఁ
పెంచె సౌందర్యసుఖరుచి ♦ సంచయమ్ము
నా శుభము లస్తమించెను ♦ నరయరేమొ?

# ఒక మాట




౧

పుస్తకము హస్తభూషణంబుగ ధరించి
నడతువు వీవీధి నెవఁడవో పడుచువాఁడ!
మృదులమూర్తియు, నర్థాసక్తహృదయుఁడైన
ఈ పరవశగాయనిఁ బిల్తు రేమిపేర?

౨

పంక్తిబద్ధములయి దిగఁబడెడు త్రోవ
లందుఁ గాల్పకలింపలే కలసి సొలసి
పోవు పాడియావులు తలంపునకుఁ దెచ్చు
భావగర్భనిర్భరములౌ పద్యగతుల.

౩

వృక్షమున నిగ్గుచేప లూహించి గొప్ప
గండ్రగొడ్డండ్ర నఱకేటి కాష్టపతులు
స్మృతికిఁ దెత్తు రయోమయశ్లేష కుటిల
కవచములు చీల్చు గూఢవ్యాఖ్యానములను.

౪

హరితశాటీకషణ మనోహరనితంబ
యాయి ధరణి మేఘదౌత్యము నాదరించు

అమృతరసవశులై యొప్పె సఖుల వికసి
తార్ద్రసుమములు బాలెంతరాండ్రపోల్కి.

౫

పచ్చగిలిన వసుంధరాభాగ్యసీమ
నెల్లయెడలఁ గన్విందుగా నుల్లసిలుచు
పసుపుబూసిన ముత్తైదువల మొగాల
ననుకరించి గుమ్మడిపూవు లందమయ్యె.

౬

కలికితీగెలఁ బ్రణయముమీఱ బలుకరించి
శ్రావణవనస్పతులు పచ్చిరసికులైరి
అక్కటెత్తని బాలశారికలుగూడ
నీడముఖముల గుసగుస లాడదొడగె.

౭

కం. పలికించిన పలుకఁ డితఁడు
నలినేక్షణ! తెనుఁగుమీఱినా డేమొ సుశీ
తలసుభగంబుగ నాతోఁ
బలుకుము నీవైన చెలువపాలొలుకంగన్.

౮

గీ. మేళవించిన తీఁగెలమీఁద మీటి
యీ జగన్ముగ్ధపదము వాయింతొ? లేక

సఖుఁడు బెజ్జాలు వేసి సాజంపు విరతు
లాడుగ దీర్చిన వేణు వూఁదెదవా? చెలియ!

౯

గీ. శ్రుతికిఁ జెవులొప్పగించి రుచు లుదయించు
స్వరకలాపమ్మునకు మదిక వశముఁ జేసి
బాహువులు సాచువాఁడ నీ ప్రణయసుఖసు
గంధబంధుర మగుభావబంధమునకు.

౧౦

గీ. చనవులు, విలాసములు, మనోజ్ఞములు నయిన
భవదమృతరాగభోగబాంధవము లతివ!
నాకుఁ బొడగట్టుచున్న వింత యెడమునుండి
నను నతిస్పష్టముగ దర్పణమునఁ బోలె.

౧౧

గీ. పెదవికదలించి పలికిన పొదలపొంత
కదలుచున్నవి నవ్వులింకను శుభాంగి!
త్రెంచిపోసిన ముత్యాలతీరుఁదోప
సూత్ర మెందుఁ బాఱసితో చూపవమ్మ!






# రాధ పిలుపు

మూడునాళ్ళాయెరా మువ్వగోపాల
నిను జూడ కేనింక నిలువజాలనుర!

* * * *

కనులలో మెదిలేవు కనకగోపాల
నీ చక్కదనమెందు దాచుకోగలవు,
చాటుగా నిలుచుండి పాటబాడేవు,
మరుగున తలవంచి మాటలాడేవు,
ముసుగులో నేమిటో ముచ్చటాడేవు,
తెరలోను రాగాలు తీసేవు కృష్ణ!

* * * *

మురళివాయించరా వరహాలకృష్ణ!
నీజాడలను బట్టుకోజాలుదేను
గజ్జెలందెలు మ్రోయ కదపరా కాలు,
నీగుట్టుమట్లెల్ల నే నెఱుంగుదును,

* * * *

నెమిలికుచ్చుతురాయి నిగనిగలాడి
నిను బట్టియిచ్చునంచును తీసినావె?
నీచుట్టుపచ్చగా పూచేనటంచు
బంగారు శాలువాపాఱేసినావె?

ఎంతసేపాయెరా యౌవనాంతమున
నీకోసమొంటిగా ప్రాకులాడితిని,
ఎందెందు వెదకినా యీబృందయందు
నీవన్నలే కానరావేల కృష్ణ!

* * * *

పొదలలో పూవువై పోయినావేమొ?
ఆలలో దూడవై యరిగినావేమొ?
తమ్ములతీయగా ద్రవియించితేమొ?
కలికివేణువుతోడ కరిగినావేమొ?

* * * *

నిన్నెందుజూతురా చిన్నారికృష్ణ!
ఏమూల వెదికేదిరా మోహనాంగ!

* * * *

వెన్నదొంగిలి కానిపింపకున్నావో?
చీరలెత్తుకపోయి దూరమైనావో?
తరుణులే నిను దారి తప్పించినారొ?
మధురలో పౌరులే మఱపించినారొ?

* * * *

ఏమిసేయుదునురా నాముద్దుకృష్ణ!
నినుజూడకేనింక నిలువజాలనుర

రాధను వేధింపరాదురా కృష్ణ
రాధపై కోపింప రాదురా కృష్ణ!
పిలిచిముద్దీయరా ప్రేమాలపించె
కలిసి క్రీడింపరా కళ్యాణకళిక!



# తిలకము

౧



కలిమికన్నియ కలికినుదుటను
కళలుచిమ్మే కనకతిలకమ!
వలపుతృష్ణని వయసు తేనెకు
పాత్రమయ్యే తిలకమా!

౨

పార్వతీసతి ఫాలతలమున
గర్వరాగము గ్రమ్ము తిలకమ!
ధూర్వహుండగు ధూర్జటికి ధృతి
దూలద్రోసిన తిలకమా!

౩

వలుదపడతుక వనువునొసటను
మొలకజీవము లొలుకుతిలకమ!
కలిసి బ్రహ్మను కంఠమొత్తగ
కౌగిలించిన తిలకమా!

౪

రచ్చకీడిచి రమణిద్రౌపది
కుచ్చెలలుగొని కోకలూడ్చిన
చిచ్చువలె నా చెలువమొగమున
విచ్చిపొండిన తిలకమా!

౫

పరువుపైఁబడి కఱకుకోలల
పరువుసేయక సాహసముతో
నరకసాగిన నాటసత్యా
ననమునంటిన తిలకమా!

౬

పెడదకత్తులు వేటలాడే
కడిదిఘోరపు కదనసీమల
తడిసివీరుల పసుపునెత్తుట
ధన్యమయ్యే తిలకమా!

౭

పరిమళమ్ములు పంతమాడగ
పరువపుంజిగి పైకిపొంగే
సరసకాముక శయనగృహముల
చక్కఁబెట్టే తిలకమా!

౮

సిగ్గువలదని చెంపలేయగ
భగ్గుభగ్గని వచ్చివలపును
బిగ్గనిలిపే పెండ్లికూతురు
నిగ్గులేలే తిలకమా!

౯

ఇనుపసంకెల లేసిత్రోసిన
వనజముఖి దేవకిలలాటము
నెనసి కంసుని హృదయఫలకము
మొనవగిల్చిన తిలకమా!



# రామలింగారెడ్డి

శా. పిండీపిండని పాడియాఁబోదుఁగులన్ బింబింప కాదంబినీ
కాండం, బుర్వరపచ్చకోకలను సింగారింప నీవేళ వ్రా
దండల్ దక్కను ద్వారబంధముల సంధానించి ప్రేమోదయా
ఖండస్వాగతమిత్తు రాంధ్రు లనురాగస్ఫూర్తి రెడ్డ్యగ్రణీ!

శా. ఆజిన్మార్గ్మగమీక దిగ్విజయకన్యాకంచుకంబౌ కుసుం
బాజెండా నెగగట్టి, వాఙ్మయసరోమాధ్వీపిపాసారతిన్
మోజుల్ మీరగ మాయనుంగుతెనుగుంబూదోటఁ బోషించిరే
రాజుల్, తత్ప్రతిభాంక రెడ్డి కులధీరప్రాచురీచ్ఛాయనీ
తేజోరూపమునందుఁ జూచెదము ప్రీతిన్ రామలింగాగ్రణీ!

సీ. తొడిమయుఁ బూవు న ♦ దుకుపొందికలుసూపు
పదభావముల కొక్క ♦ పొన్నమర్చి
విడెపువన్నియ పెద ♦ వి మెఱుంగలదినట్ల
లంకారముల నర్థ ♦ లక్ష్మినేలి
లతికనికుంజవ ♦ లయమల్లినరీతిఁ
గథకు తెంపులులేని ♦ గమకమిచ్చి
కలహంస కొలనియా ♦ లలఁ బ్రోదిగానుభంగి
నుడుల కొయ్యారంపు ♦ నడలునేర్పి
గీ. రసికు రుచిరోపగూహన ♦ ప్రమదమొకట
వీరునిజభుజాస్ఫాలనో ♦ ద్వేగమొకట

ప్రకృతి తనవశమైనట్లు ♦ ప్రతిభతోడ
భారతమ్మెల్ల నేకవి ♦ బ్రహ్మవాళి.

చ. అతని తెనుంగుతీర్పులర ♦ హాస్యములన్ గ్రహియించి తత్ప్రభా
యుతజనులేఖనీముఖ ని ♦ రంకుశపాలిత భారతీకళా
న్వితరసరేఖ రాగిలిన ♦ నేర్పరివంచు, త్వదీయభావలా
లితవిలసద్విపంచిఁ గది ♦ లింతుము నేఁడు కుతూహలంబునన్.

సీ. చవిఁజూచితివి స్వతంత్ర ♦ చైతన్యభావనా
మాంసలాంగలకవి ♦ హంససూక్తి
పాటించితివి స్వైర ♦ భావభోగరిరంస
నెసఁగుపరాసుల ♦ రసికలిప్స
క్రీడించితివి ప్రౌఢి ♦ పేడెత్తు సూరన
సుకవివాగ్దోహద ♦ శోభనమున
వెలయించితివి కండ ♦ గల తెనుంగునఁగావ్య
తత్త్వమానందసూ ♦ త్రముల సరణి

గీ. నేఁడు నీకన్న నీయూధు ♦ నికమహాంధ్ర
వాఙ్మయమునడిపింప నె ♦ వ్వఁడు సమర్థు
డెలమి నీకంకణము ధరి ♦ యించి ముందు
త్రోవదీయుము రామలిం ♦ గావతంస!

# కలియుగార్జునుడు

(శ్రీ గుండవరపు అప్పారావుగారు.)

ఉ॥ కూరిమి వీరదంపతుల ♦ కున్ జనియించిన భారతీయు, లా
చారతపోధురీణులయి ♦ సాధనఁ జేసి గడించి రేద్విష
ద్దారుణదారుణంబయిన ♦ ధర్మధనుస్సు, తదీయతేజ మిం
పారఁగఁజేయు మాకలియు ♦ గార్జును నప్పయధన్వి నెప్పుడున్.

సీ. విన్నాము కడుపులో ♦ నున్న కండలు కద
లఁగ భారత రణ ♦ రంగచరిత
చెవియొగ్గినాము, పృ ♦ చ్ఛినశల్యములు పూంప
గింప రామాదుల ♦ సంపరోత్ర
ఆలించితిమి గుండె ♦ లదరఁ బల్నాటి వీ
రుల గండ్రగొడ్డండ్ర ♦ రోషపదము,
అవధరించితిమి క ♦ న్నవ వేడి యెఱుపెక్క
రాజపుత్రుల యుల్లె ♦ త్రాళ్ళమ్రోత
గీ. భావమున; నంతెకాని మా ♦ పాపవశతఁ
జూచినది లేదు, చూడగా ♦ నోచలేదు
నేటికి ధనుస్సునెత్తి సం ♦ ధించినావు
వహా యుద్ధ్వస్తంబిదియె అప్ప ♦ రాయధన్వి!

ఉ. వ్రాసినవ్యాసవాక్యముల ♦ భావభరంబెఱుగంగలేని స
న్న్యాసుల, మిట్టిమీఁదగతి ♦ నమ్మునడుం దగువీరగౌరవో
ల్లాసము నెట్టుసల్పఁగఁగ ♦ లారము, మాటలులేనిమాదు వి
శ్వాసమె పచ్చకప్రవుని ♦ వాళిగ గైకొను మప్పరాణ్మణీ!

సీ. వల్లెఁజెప్పిన వేద ♦ పన్నాలువర్జించి
బాణదేశికుఁడైన ♦ ద్రోణుశక్తి
మంత్రోదకముల ని ♦ ర్మలమైనచేదోయి
రక్తాంజలిడిన భా ♦ ర్గవిసుదీక్ష
అమృతతేజోభూత ♦ మయిన గంటమువీడి
కత్తిదాలిచిన తి ♦ క్కనయాశన్ను
గోచీవదల్చి కం ♦ గులవీరకాశెఁ గ
ట్టిన యానపోత ధీ ♦ రుని తపన్ను

గీ. బ్రాహ్మణుఁడవయి ధనువుఁజే ♦ పట్టినట్టి
నీభుజాయుగళీపీఠి ♦ నిలుచుగాత
ఆంధ్రలోకద్రోణాచార్యుఁ ♦ డనెడికీర్తి
మోయుదువుగాత శ్రీయప్ప ♦ రాయధన్వి!

---

# శుద్ధ సూచిక

| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౬ | ౫ | చద్రికలు | చంద్రికలు |
| ౭ | ౬ | మణీ | మాణి= |
| ౧౯ | ౧౦ | హాదమును | హ్లాదమును |
| ,, | ౧౬ | యొడ్డెక్కితిపి | యొడ్డెక్కితిని |
| ౨౦ | ౨ | రేఁవు | రేవు |
| ౨౧ | ౧౪ | సుకవికెస్వాధీన | సుకవి కస్వాధీన |
| ౨౭ | ౫ | మధుసాతము | మధుపాతము |
| ౩౦ | ౧ | సిగలో | సిగలలో |
| ౩౩ | ౬ | చెప | చేవ |
| ౩౮ | ౧౬ | ధవళిమమని | ధవళిమ యని |
| ౪౪ | ౧౫ | వేలెత్తి | ప్రేలెత్తి |
| ౫౦ | ౯ | వెచి | వేచి |
| ౫౪ | ౨౨ | సరి | సడి |
| ౫౫ | ౨ | కెమ్మెర | తెమ్మెర |
| ,, | ౭ | లోవువారు | బోవువారు |
| ౫౮ | ౧౧ | ఎవతవు | ఎవతెవు |
| ౫౭ | ౭ | భుజించు | భుజియించు |
| ౬౨ | ౫ | చెలి | తెలి |
| ౬౬ | ౧౧ | నిచ్చి | విచ్చి |
| ౬౭ | ౧౧ | సంతాప్రిణభరము | సంప్రీణనమ్ము |
| ,, | ౧౭ | జితించి | జతించి |
| ౮౧ | ౧౨ | పారెడు | పంచెడు |
| ౮౩ | ౭ | వులు......పో | లును నిక వేటిగానక ఫలో |
| ౮౫ | ౧ | తెలిమద్దు | నునుమద్ది |
| ౮౬ | ౯ | పాలిచిన | మలిచిన |
| ౮౮ | ౧౬ | నారళ్య | సారళ్య |
| ౮౭ | ౧౧ | నానందముణ్ | నానందముల్ |
| ౯౦ | ౧౦ | క్రీడాధీప్రితుండ | క్రీడాప్రీతుండ |
| ,, | ౧౧ | తంపీ్ర | తండ్రి |